తెలంగాణ రాష్ట్రంలో నూతన జిల్లా ఆవిర్భవించిన నిర్మల్ జిల్లా గురించి తెలుగు.న్యూస్ అందిస్తున్న సమగ్ర సమాచారం.

చారిత్రక నేపథ్యం ఉన్న ప్రాంతం నిర్మల్ జిల్లా. అక్కడ శతాబ్ద కాలాల నాటి శిలా శాసనాలు గతించిన చరిత్రకు అద్దం పడుతున్నాయి. గతంలో ఈ ప్రాంత అభివృద్ధిలో కీలక పాత్ర పోషించిన రాజు నిమ్మ రాయుడు. ఆయన పాలనలోనే ఆ ప్రాంతానికి నిర్మల్ జిల్లా అనే పేరు వచ్చిందని కథనం.

1830లో ఏనుగుల వీరాస్వామయ్య నిర్మల్ ప్రాంతంను సందర్శించాడు. ఆ గ్రంథంలో తనకు గురించి వర్ణించాడు. ఇది తెలంగాణ విమోచనోద్యమంలో మొదటి ప్రాంతం. నిజాం నిరంకుశ పాలనకు చరమగీతం పాడటంతో పోడిగించిన ప్రాంతంగా పేరుగాంచింది. ఊపిరి దూసుకు వెళ్ళి ఉరికంభం ఎక్కిన ఘనత ఈ ప్రాంతంగానే. కాలంలో ఉరుల మర్రి సంఘటన చరిత్రలో నిలిచిపోయింది.

నిర్మల్ జిల్లా, దాదాపు 1,485 చదరపు మైళ్ల వైశాల్యంలో అవతరించింది. హైదరాబాద్ నుంచి ఉత్తరంగా సుమారు 210 కిలోమీటర్ల ఏడవ నంబర్ జాతీయ రహదారిపై ఉంది. జిల్లాకు ఆదిలాబాద్, ఈశాన్యంలో ఆసిఫాబాద్, తూర్పున మంచిర్యాల, మహారాష్ట్ర లోని నాందేడ్ జిల్లా సరిహద్దుల సమీపంగా ఉన్నాయి. జిల్లాలో 19 మండలాలు ఉన్నాయి, 28 నిర్జన గ్రామాలు ఉంది. నిర్మల్ మరియు భైంసా రెవెన్యూ డివిజన్లు కూడా 424 రెవెన్యూ గ్రామాలను గ్రామాంతరాల్లో పొందాయి.

2011లో నిర్మల్ జిల్లాలో ఉదాత్త జనాభా ఉంది. ఈ జిల్లాలో 7,09,418 మంది వారిగా నివసిస్తున్నారు, అలాగే 78% ప్రజలు గ్రామీణ ప్రాంతాల్లో ఉన్నారు. ఈ జిల్లాలో తెలుగు భాషను 65.52% మంది, ఉర్దూ భాషను 13.54% మంది, మరాఠీ భాషను 10.88% మంది, లంబాడీ భాషను 6.43% మంది, గోండి భాషను 1.52% మంది మాట్లాడుతున్నారు. అంతటా, జిల్లాలో అక్షరాస్యత రేటు 58% ఉంది.

నిర్మల్ జిల్లాలో మత్స్య పరిశ్రమ అభివృద్ధి పథంలో ముందుకు సాగుతోంది. దాంతో పాటు ఎక్కువగా పత్తి జిన్నింగ్ మిల్లులతో పాటు బీడీ పరిశ్రమ ఉంది. అలాగే నిర్మల్ చెక్క బొమ్మలు మరియు పెయింటింగ్ లకు ఎంతగానో ప్రసిద్ధి చెందింది. హస్తకళలు సాంప్రదాయబద్ధంగా నక్కాష్ చేత తయారు కావడం విశేషం. 1955లో ఏర్పడిన నిర్మల్ పెయింటింగ్స్ అండ్ టాయ్స్ పరిశ్రమలో పునికి కర్రను వినియోగిస్తారు. ఇక్కడి పెయింటింగ్స్ బంగారు వర్ణానికి ప్రసిద్ధి.

నిర్మల్ జిల్లాలో డిగ్రీ, ఇంజనీరింగ్, మెడికల్ మరియు లా కోర్సులకు సంబంధించి మొత్తం 12 కాలేజీలు ఉన్నాయని తెలుస్తోంది. వీటిలో ప్రధానమైనవి మహిళల గవర్నమెంట్ డిగ్రీ కాలేజీ, పంచశీల్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్ మరియు జ్ఞాన సరస్వతి, నందన, వశిష్ట డిగ్రీ కాలేజీలు. అదేవిధంగా ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా నిర్మించిన మెడికల్ కాలేజీ ఉంది.

నిర్మల్ జిల్లాలో గోదావరి నది, స్వర్ణ నది, సుద్దవాగుతో పాటు కడెం నది కూడా ప్రవహిస్తుంది. ఈ నదుల మీద ప్రాజెక్టులు ముందుకు సాగుతున్నారు. కడెం నారాయణ రెడ్డి ప్రాజెక్ట్ లేదా కడెం డ్యాం ప్రాజెక్ట్ ద్వారా జిల్లాలో సుమారు 68 వేల హెక్టార్లకు సాగునీరు అందుతుంది.

స్వర్ణ ప్రాజెక్ట్ సారంగపూర్ మండలం స్వర్ణ గ్రామంలో గోదావరి నదిపై నిర్మించారు.

గడ్డెన్న ప్రాజెక్ట్ ఖానాపూర్ మండలం మేడంపల్లి గ్రామంలో గోదావరి నదిపై నిర్మించారు. దీని ద్వారా ఖానాపూర్, కడెం మండలాల్లోని సుమారు 14 వేల ఎకరాలకు సాగునీరుతో పాటు తాగునీరు కూడా అందిస్తున్నారు.

ఈ జిల్లాలో బీఆర్ఎస్ పార్టీ ఆధిక్యతను కనబరుస్తుండగా ప్రముఖ నేతలు ఉన్నారు, అందుకుంటున్నారు అల్లోల ఇంద్రకరణ్ రెడ్.

జిల్లాలో పలు ఆలయాలతో పర్యాటక ప్రాంతంలో నిలయంగా ఉంది. ఇవి ప్రముఖ ఆలయాలు:

--జ్ఞాన సరస్వతి దేవాలయం... బాసర మండలం బాసరలో చాళుక్యుల కాలంలో నిర్మితమైన దేవాలయం. భారతదేశంలో ఉన్న ప్రముఖ సరస్వతి దేవాలయాలలో రెండోవ ఆలయం.

--అడెల్లి పోచమ్మ ఆలయం... సారంగాపూర్ మండలం అడెల్లి గ్రామంలో వెలసిన మహా పోచమ్మ కల్పవల్లి.

--కదిలే పాపేశ్వరాలయం... కదిలిలో ఉన్న ఈ ఆలయం ప్రాముఖ్యతను కలిగి ఉంది.

--కాల్వ నరసింహ స్వామి ఆలయం.. కోసేరులోని కాల్వ అనే గ్రామంలో ఉన్న ఆలయం.

నిర్మల్ నుంచి సుమారు 15 కిలోమీటర్ల పరిధిలో నాలుగు కోటలు ఉన్నాయి. మూడు చిన్న కోటలు పట్టణానికి సమీపంలో ఉండగా నాల్గోవది నుంచి పది కిలోమీటర్లు దూరంలో (నిర్మల్ కోట) ఉంది.

దాంతో పాటు శ్యామ్ ఘర్ కోట..ప్రకాశవంతమైన నీలిరంగు గొడుగులు, విరిగిన బెంచీల అవశేషాలు కోట  అంతటా ఉన్నాయి. స్మారక చిహ్నం పక్కనే హరిత ఫలహారశాఖ ఉంది.

సోన్ గఢ్ కోట.. గోదావరికి దగ్గరగా ఉన్న ఈ కోట ఒకప్పుడు పాలకులకు ముఖ్యమైన ఠాణాగా ఉండేది. శిథిలావస్థకు చేరుకున్న ఈ కోట వెనుక భాగంలో ఒక సొరంగ మార్గం ఉంటుంది.

బత్తీస్ గఢ్ కోట... ఈ కోట ప్రాకారాలు, బురుజులు చాలా వరకు చెక్కు చెదరకుండా ఉన్నాయని తెలుస్తోంది. బురుజుపైన ఫిరంగి ఉండగా.. కోట ప్రవేశ ద్వారం ఎడమవైపున స్తంభాల హాలు ఉంది.

నిర్మల్ బొమ్మలు, పెయింటింగ్స్ కు అంతర్జాతీయ స్థాయిలో మంచి గుర్తింపు ఉంది. సుమారు నాలుగు వందల సంవత్సరాల క్రితం నిర్మల్ ను పాలించిన నిమ్మనాయుడు కొయ్య బొమ్మలను తయారు చేసే కళాకారులను తీసుకొచ్చి ఉపాధి కల్పించారట. లేపాక్షి ఎంపోరియం ద్వారా ఈ బొమ్మలను ఇంకా అమెరికా, రష్యా, అరేబియా, ఇరాన్, మలేషియా వంటి దేశాలకు ఎగుమతి చేస్తున్నారు. అంతేకాకుండా నిర్మల్ పెయింటింగ్స్ అండ్ టాయ్స్ పరిశ్రమకు రాష్ట్రపతి అవార్డు లభించింది.

నిర్మల్ జిల్లాకు ఓ చేదు జ్ఞాపకం కూడా ఉంది. వెయ్యి ఉరుల మర్రి.. నిజాం మరియు బ్రిటిష్ సేనల అరాచకానికి గుర్తుగా చరిత్రలో నిలిచిపోయిన విషాదఘటన. విముక్తి, అస్థిత్వం కోసం పోరాడిన రాంజీ గోండును ఆయన అనుచరులను కలిపి వెయ్యి మంది గెరిల్లా యోధులను ఎల్లపల్లి గ్రామ సమీపంలో ఉన్న భారీ మర్రి చెట్టుకు సామూహికంగా ఉరిపేశారు అప్పటి నిరంకుశ పాలకులు.

అభివృద్ధి పథంలో దూసుకెళ్తున్న నిర్మల్ జిల్లా అన్ని రంగాల్లో మరింతగా రాణించాలని తెలుగు.న్యూస్ ఆకాంక్షిస్తుంది.